# తిరుపతి వేంకటకవుల
# కవితా వైభవం

డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం



# తిరుపతి వేంకటకవుల
# కవితా వైభవం

వ్యాఖ్యాత

డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం

ప్రచురణ




రిజిస్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**Tirupathivenkata Kavula Kavitha Vaibhavam**
Selections from the poetic works of
TIRUPATHI VENKATA *KAVULU*
**by Dr. G. V. SUBRAHMANYAM**


**యువభారతి**

ప్రచురణ : **52**
ప్రథమ ముద్రణ **2, 200** ప్రతులు
*2, జనవరి 1977*

ముఖచిత్ర రచన, అక్షరాలంకరణ :
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
నాగార్జున ప్రింటింగ్ వర్క్స్, హైద్రాబాదు.

ప్రతులకు :

**యువభారతి**

5, కింగ్స్‌వే, సికిందరాబాదు-**500 003**

వెల : రూ. **2-00**

---

*Paper used for the Printing of these books was made available by the Government of India at concessional rates*

**YUVABHARATHI IS GRATEFUL**

---




# యువభారతి ప్రచురణలు

మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమాణాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం కలుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్య భావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పదమూడేండ్లుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యం కంటే ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలను రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందిస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇది యువభారతి 52వ ప్రచురణ. ఇంతవరకు రెండు లక్షల ఏభైవేలకు పైగా ప్రతులను సాధ్యమైనంత తక్కువ వెలకు పాఠకులకు అందించడానికి పూనుకొంది.

యువభారతి సాహితీ మిత్ర పథకంలో దాదాపు 4,400 మందికి పైగా సాహితీ మిత్రులు చేరారు. రానున్న ఉగాది నాటికి ఈ సంఖ్య 10 వేలకు చేరుకోవాలన్న మా లక్ష్య సాధనలో తోడ్పడండి. యువభారతి శాశ్వత జీవిత సభ్యత్వ పథకాలలో ఆరువందల మందికి పైగా భారతీ మిత్రులుగా, యాభైమంది భారతీ భూషణులుగా చేరారు. ఏ ఒక్క పథకంలోనైన సభ్యులుగా చేరి మా "నందిని" మాసపత్రికను ఉచితంగా పొందే అవకాశం కల్పించుకోవలసిందిగా సహృదయులకు విజ్ఞప్తి. 'నందిని'లో యువభారతి కార్యకలాపాల వివరాలే కాకుండా సాహిత్యానికి సంబంధించిన అనేకాంశా లుంటాయి

'నందిని' బహుమతి చందా పథకంలో ఇప్పటివరకు దాదాపు 800 మంది చేరారు. కేవలం ఒక్క రూపాయితో భారతదేశంలో మీ సన్నిహితు లెక్కడున్నా సరే-వారు మిమ్మల్ని సంవత్సరం పాటు గుర్తుంచుకునేలా, యువభారతి సంస్థతో పరిచయం వేలిగించినందుకు మిమ్మల్ని అభినందించేలా చేయగలుగుతుంది 'నందిని'. అందుకే, అర్థిస్తున్నాము మీ నుండి, కేవలం ఒక్క రూపాయి + మీ ఆత్మీయుల చిరునామా, కలాదిమంది సహృదయులకు సన్నిహితం కావాలన్న లక్ష్యసాధనకు తోడ్పడండి.

మా తపస్సు ఫలించి తెలుగు దేశంలో అధ్యయన శీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాం.

జనవరి 2, 1977.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు

# మా మాట

తెలుగుదేశములోని సాహిత్యాభిమానులలో "అధ్యతనాంధ్రకవి ప్రపంచనిర్మాతలు" తిరుపతి వేంకటకవులను ఎరుగనివారుండరు. రాజస్థానాలకూ పండితకదంబాలకూ వైయుక్తికమైన కవి సాధనలకూ గ్రంథాలయాలకూ కట్టుబడిపోయి అసూర్యం పశ్యగా ఉన్న తెలుగు కవితావాణిని ప్రజాసందోహానికి అందించి కవితోద్యమ ప్రగమనానికి ఘంటాపథాలు పర్చిరిచిన జంటకవులు వారు. వారి శిష్య పరంపర తామరతంపరగా భాషాభిమానుల హృదయ సరోవరాల్లో అల్లుకునిపోయారు. నాటి తెలుగుదేశంలోని అన్ని సంస్థానాల్లోనూ ప్రసిద్ధ నగరాలల్లోనూ అష్టావధాన శతావధానాది సాహిత్య గోష్ఠులను రససముజ్జ్వలంగా నిర్వహించి కవిత్వాన్ని ప్రజాయత్తంచేసిన విద్వత్కవులు. పాండవోద్యోగ పాండవవిజయాది నాటకాలద్వారా ఛందోబద్ధమైన పద్యాన్ని ప్రజల దైనందిన జీవితంలోకి ప్రవేశపెట్టిన సరసకవులు. దేవీభాగవతం బుద్ధచరిత్రల వంటి మహాకావ్యాలనేగాక శతాధిక వ్యాసాలతోనూ ఉపన్యాసములతోనూ సాహిత్యానికి ఉన్నతప్రమాణాలను సృష్టించిన మనీషులు. తిరుపతి వేంకట కవులతో పరిచయం నిన్నటి తెలుగు ప్రజలను ఉత్తుంగ లూగించిన కవిత్వంతో పరిచయం.

తిరుపతి వేంకటకవుల కావ్యాలలో ప్రసిద్ధమైన కొన్ని పద్యాలను ఏరి సరళవ్యాఖ్యానాన్ని సమాకూర్చినవారు. డా॥ జి. వి. సుబ్రహ్మణ్యం గారు. ప్రథమాంధ్రమహాపురాణము మార్కండేయపురాణాన్ని గూర్చి పరిశోధనచేసి పి హెచ్. డి., పట్టాన్ని పొందినవారు. వీరరసాన్ని పర్యాలోచించి ఆంధ్రప్రదేశ సాహిత్యఅకాడమివారి బహుమతి నందుకొన్నవారు. యువభారతి వేదికనుండి పింగళిసూరన్న, శ్రీశ్రీ, దాశరథి, విశ్వనాథలను గూర్చి చక్కని ప్రసంగాలను చేసిన వాగ్మివతంసులు. తమ ప్రతిభాపాండిత్యాలతో సాహిత్యప్రణయంతో యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమానికి సర్వవిధాలా చేయూతనిస్తున్న సరసహృదయులు' యువభారతి గౌరవ సభ్యులు ప్రచురణలకు ప్రధాన సంపాదకులు. తిరుపతివేంకటకవుల కవితా వైభవాన్ని దిఙ్మాత్రంగానైనా పరిచయంచేసే అవకాశాన్ని యువభారతికి కల్పించిన శ్రీ సుబ్రహ్మణ్యంగారి ఔదార్యానికి భాషాభిమానానికి మా అభివందనాలు.

2-1-1977

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

# జంటకవులు

తెలుగు సాహిత్యంలో జంటకవుల పేర్లు లెక్కపెట్టటం ప్రారంభిస్తే కనిష్ఠి కాధిష్ఠితు లయ్యే వారు తిరుపతి వేంకటకవులు. వీరి పేర్ల కలయిక కున్న కుదిరిక తెలుగులో మరే జంట కవుల పేర్లకూ లేదు. దివాకర్ల తిరుపతి శాస్త్రి, (1872-1919) చెళ్ళపిళ్ళ వేంకట శాస్త్రి (1870-1950) అనే పేర్లలోని ప్రధాన నామాలకు విశిష్టమైన కలయిక రమణీయార్థదాయకంగా, నీరక్షీరన్యాయంగా ఏకరూపంగా భాసించింది. ఇది సాక్షాద్బ్రహ్మ (చెర్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు) కలిపిన జంట. తెలుగులో మిగిలిన జంటకవుల పేర్లు తిలతండుల న్యాయంతో నిలచినవేగాని నీరక్షీర న్యాయాన్ని పొందజాలక పోయినవి. తెలుగువారి కభిమానదైవమైన తిరుపతి వేంకటేశ్వరస్వామి పేరు ధ్వనించేటట్లు పేరు కుదరటం వారి అదృష్టం!

'అడివి యుసిరి కాయయు నుప్పును' కలిసినరీతిగా వారినేస్తం కడు విచిత్రంగా సంఘటింపబడింది. తిరుపతి శాస్త్రిగారు వెల్నాటివారు, వేంకట శాస్త్రిగారు ఆరామ ద్రావిడులు; ఒకరు ఎండగంటి గ్రామస్థులు, మరొకరు ఏనాము వాస్తవ్యులు. వారి స్నేహం ఆదర్శప్రాయం.

'నీరక్షీరము లట్టు లెల్లపుడు నీనేస్తంబు గైకొంటి మ
క్రూరంబైన మనంబుతో నిదియ మాకుం దెచ్చెఁ గీర్త్యాదికం
బేరే మైత్రిని గూర్చి చెప్పుకొనుచో దృష్టాంతమౌఁ గాక పెం
పారం దిర్పతి వేంకటేశ్వరుల సఖ్యం బెల్లకాలంబులన్'

"ఇరువురుఁ గూడియే రచన యెప్పుడు చేయుదు రొక్కవేళ నొ
క్క రొకటి, యొక్క రింకొకటి కైకొని చేయుదు, రందు హెచ్చుత
గ్గొరులకుఁ గానరాక యది యొక్కరు చేసిన భంగి నుండు, నొ
క్కరు రచియించి రేనియును గాఁదగు తిర్పతివేంకటీయమై"

ఈ ప్రతిజ్ఞలు వారి అభేదస్నేహప్రవృత్తికి వ్యాఖ్యానాలు. ప్రత్యర్థు లెందరో వారి స్నేహాన్ని భగ్నంచేయాలని యత్నించారు; చివరకు విఫలు లయ్యారు.

తిరుపతి వేంకట కవులు అవధానసభల్లో ఆశుకవిత్వం చెప్పి అలరించేంతవరకూ తెలుగువారికి జంటకవిత్వ మంటే స్పష్టమైన తెలివిడి లేదు.

'ఒక చరణం బతండు మఱియొక్కటి నేను మఱొక్కఁ డాతఁడున్
సకల కవీంద్ర సంతతులు సమ్మతిచేఁ దలలూపి మెచ్చఁగాఁ
బ్రకటతరాశుధార దనరన్ రచియింపఁగ నేర్తుమయ్య ! నూ
టికి నెలగయ్య ! నిక్క మిది డెబ్బదిమాటలు సెప్ప నేటికిన్ !'

అని విడమరిచి మొదటిసారి చెప్పిందీ, చేసి చూపిందీ ఈ జంటకవులే. ఒక్క వ్యక్తిలో ఉండవలసిన సమాహిత బుద్ధి ప్రాభవం జంటకవులల్లో ఇద్దరి నాశ్రయించి యేకోన్ముఖంగా ప్రవహించటం, ఆశ్చర్యకరం. భావయిత్రీ కారయిత్రీ ప్రతిభలయందు వారు సాధించిన సమన్వయసిద్ధి అపూర్వం.

తిరుపతి వేంకట కవులు తెలుగుదేశానికి మొదట శతావధానులుగా పరిచయమైనారు. శతలేఖిన్యవధాన ప్రక్రియ సంస్కృతాంధ్రాలలో వేర్వేరుగా చేపట్టి నిర్వహించినవారు ప్రాచీన కవుల్లో లేకపోలేదు. కాని, అట్టివారు నూటికీ కోటికీ ఒక్కరు. తెలుగులో చరికొండ ధర్మన, రామరాజ భూషణుడు, మాడభూషి వేంకటాచార్యులు మొదలైనవా రిటువంటివారే; కాని, వారి శతావధాన ప్రక్రియ దేశవ్యాప్తం కాలేదు. ప్రజలలో సాహిత్య చైతన్యం కలిగించలేదు. కాగా-తిరుపతి వేంకట కవులు సంస్కృతాంధ్రాలలో నల్లేరుపై బండినడకలాగా ఆశుకవిత్వాన్ని ధారావాహినిగా నడిపి, 'రెండు బాసలకు మేమె కవీంద్రుల మంచు' శతావధానాలేకాక, అష్టావధాన సహస్రావధానాలు సైతం చేసి మేటికవు లనిపించుకొన్నారు. ఒక్కొక్కరు అవధానాలు చేయటం పూర్వప్రసిద్ధంగాని జంటకవుల అవధాన విధానం వీరితోనే శ్రీకారం చుట్టబడింది. నానారాజ సందర్శనం చేసి, కవిపండితప్రజాపరిషత్తుల్లో అవధాన కవితాకళా సౌందర్యావిష్కార మొనర్చి ఆంధ్రావళికి నూత్నకవిత్వోత్తేజాన్ని రేకెత్తించిన అమృతమూర్తులు ! ఆంధ్రసాహిత్య మొకసారి 'శ్రీనాథుండు ప్రోవన్' సొంపు వాటిల్లింది. మరలా తిరుపతి వేంకట కవులు 'సాకన్' ఇంపు సొంపారింది.

క్రీ.శ. 1892లో కాకినాడలో విశాఖానక్షత్రద్వయంలాగా తి. వేం. కవులు జంటకవులుగా శతావధాన ప్రక్రియను ప్రథమంగా ప్రదర్శించేసరికి జాతి కొక కను విప్పైంది. నాడుమొద లా కవిద్వయం శ్రీకాకుళం మొదలు చెన్నపట్టణందాకా ఉన్న

తెలుగుదేశంలో అవధాన కవితాయాత్రలు చేసి భారతికి బంగారు పల్లకి సేవను జరిపించటంతో తెలుగు బిడ్డల రసహృదయాలు సారస్వత భక్తిభావంతో పులకించి పొంగులువారాయి. వారిని దర్శించినంత మాత్రంలోనే తెలుగువారి నాల్కలపై ఛందస్సు లాస్యంచేసింది. జంటకవిత్వం చెప్పాలనే కోరిక లీరిక లెత్తినవి. వారి తరువాత తలలెత్తిన జంటకవుల కందరికీ తి. వేం. కవులే ఆదర్శప్రాయులు. ఒక అర్ధ శతాబ్ది కాలం వరకు జంటకవు లనే భావం సారస్వతలోకాన్ని ముచ్చట ముర పాలతో ముంచెత్తింది.

శృంగార రస కావ్య నిర్మాతలుగా తి. వేం. కవులకు తెలుగునాట అఖండ కీర్తి వచ్చింది. పరబాషా సాహిత్యాచార ప్రభావాలవలన జాతిలో దేశీయ భాషా సాహిత్యాభిరుచి మందగించి, తత్పరన పాఠనాదులు అస్తినాస్తివిచికిత్సలో పడిన గడ్డు రోజుల్లో ప్రజామనః ప్రవృత్తిని అవధాన ప్రక్రియతో ఆకర్షించి, సర్వజన హృదయాహ్లాదీ, రసరాజంఅయిన శృంగారరసం ఆత్మగాగల కావ్యరచనా ప్రక్రియతో మురిపించి, సాహిత్యాభిరుచిని జాతిలో పునరుజ్జీవింప జేసినారు. వీరి రసికానందం, శ్రవణానందం. పాణిగృహీత, లక్షణా పరిణయం, శుకరంభా సంవాదం జాతిలో సాహిత్య చైతనాన్ని కలిగించినట్టివే. 'శృంగారీ చేత్ కవిః కావ్యేజాతం రసమయం జగత్' అన్నట్లు వీరురసమయమైన కావ్యజగత్తునే కాక, రసికమైన సహృదయ జగత్తును కూడ సృష్టింప గల్గినారు.

తి. వేం. కవులు ఆంధ్రావళికి శ్రవణానందాన్నే కాక నయనానందాన్ని కలిగించే రూపకప్రక్రియను నిర్వహించి ప్రజాహృదయానంద రససింధువులై ప్రసిద్ధి కెక్కారు. తెలుగువారి అభిమాన కావ్యమైన మహాభారతంలోని కథను మొదటిసారి నాటకాలుగా తీర్చి దిద్దిన గౌరవం తి. వేం. కవులకే దక్కింది. వీరి పాండవోద్యోగ విజయాలు తెలుగునాట వీరరస విజయ యాత్రలు సాగించి ఆబాలగోపాలాన్ని ఆనందావేశమగ్నుల్ని చేశాయి, ఇప్పటికీ చేస్తున్నాయి. వీరి ప్రహసనాదులు ప్రజల్లో పేరుకొని పోయిన మూఢాచారాలను, వ్యసనాలను, అర్థంలేని పట్టుదలలను, సాను భూతిలేని విమర్శలను, వింత వింత వితండవాదాలను, వెక్కిరించి వెలివేశాయి. కందు కూరి వారి సాంఘిక సంస్కరణోద్యమం, గిడుగువారి బాషా సంస్కరణోద్యమం పూర్వరంగం సిద్ధం చేయగా తి. వేం. కవుల కవిత్వ సంస్కరణోద్యమం రసవంతంగా తెలుగునాట నిర్వహింప బడింది. ముగ్గురికీ ప్రజాశక్తులే మూలాధారాలు. సమకాలీన సాంఘికావసరాలను గుర్తించి, ప్రాతను సంస్కరించి, క్రొత్తను ప్రదర్శించి భావి

పురోభివృద్ధికి దోహదమయ్యే నవ్యాలోకాన్ని జాతి కందించటమే వీరి ఉద్యమ పరమ తాత్పర్యం! అందులో తి. వేం. కవుల ఉద్యమలక్ష్యం సాహిత్య నవ్యాలోకం!

తి. వేం. కవుల కవితా విహంగానికి రక్తి యొక రెక్క; భక్తి మరో రెక్క. జగదంబ వారి ఉపాస్య దైవం. ఆమె చల్లని చూపుల్లో ఎల్లలు వేసుకొన్నది వారి పురాణస్తోత్ర శతక వాఙ్మయ సామ్రాజ్యం! దేవీ భాగవతం దేవీభక్తికి కల్పవృక్షం. కామేశ్వరీ శతకాదులు, స్తోత్రాదులు భక్తి బోధసుధానిధులే కాక అనామయ ప్రసాద మహిమా గరిమాన్వితాలు. శివకేశవ సూర్యాదులను వారు స్తుతించినా వారి దద్వైత భక్తి. దైవికమైన శక్తి వారి ఉక్తి నాశ్రయించి భక్తసంతతికి సాహిత్యోపనానురక్తిని కలిగించింది. వారి శృంగార కావ్యాలు వారి ఐహికానురక్తికీ, భక్తి కావ్యాలు పార మార్థిక ప్రవృత్తికీ పతాకలుగా ప్రకాశిస్తున్నాయి.

అధిక్షేప సాహిత్యం వారి అభిమాన ధన నిక్షేపం. ప్రాచీన గురు శిష్య ధర్మం, సత్యాన్వేషణం, సమసామర్థ్యం గల పండితకవులతో శాస్త్రచర్చలు చేసే వీరప్రవృత్తి, ఉన్మార్గవర్తనులైన ఆప్తులను ముఖాముఖీ మందలిస్తూ, వ్యంగ్యంగా అధిక్షేపిస్తూ సన్మార్గ వర్తనులుగా చేసే పవిత్రోద్దేశం వారి అధిక్షేప సాహిత్యానికి పరమ ప్రయోజనం. దీనికి ఫలం విశ్వశ్రేయస్సే!

తి. వేం. కవుల కఖండకీర్తి రావటానికి మరో ముఖ్య కారణం వైవిధ్యంతో కూడుకొన్న సాహిత్యాన్ని సృజించి సమకాలీన సాహిత్య జగత్తులో లేని నవ్యత నావిష్కరించే ప్రయత్నం. వా రొకసారి పట్టిన ప్రక్రియ మరలా పట్టలేదు. వారి కావ్య జాలంలో ఒక్కొక్కటి ఒక్కొక్క విశిష్ట సృష్టి! మచ్చుకు కొన్ని - శ్రవణానందం శృంగార రసప్రధానమైన సాంఘిక కావ్యం. పాణిగృహీత ప్రహసనతుల్యమై నశృంగార రసాభాస కావ్యం, మనస్తత్వ శాస్త్ర రహస్య ప్రతిపాదక పద్య కావ్యం. లక్షణా పరిణయం ఆశువుగా చెప్పిన వర్ణనాత్మక కావ్యం. ఏలామాహాత్మ్యం పుణ్యతీర్థ మహాత్మ్యం; సుశీల - యాత్రా కావ్యం, సాంఘిక విమర్శ, పాత్ర చిత్రణం ప్రధాన మైన పద్య కావ్యం పూర్వ హరిశ్చంద్ర చరిత్రం - పురాణ పాత్రల పూర్వ కథలు తెలిపే కథాకావ్యం; జాతకచర్య ప్రథమాంధ్ర పద్యాత్మక స్వీయచరిత్ర. పురాణ కథలు, చరిత్ర కథలు భక్తి కథా కావ్యాలు. స్తోత్ర వాఙ్మయం భక్తి శతక కవిత్వం పాండవోద్యోగ విజయాలు వీర రస రూపకాలు; పాండవజననాదులు వస్తు రూపకాలు. పండితరాజం - ప్రతీకార్థ ప్రధానమైన రూపకం, కవి జీవిత గాథ. అనర్ఘ నారదం-

తత్వార్థ ప్రధానరూపకం. సుకన్య సాంఘిక సంస్కరణోద్దిష్టమైన పౌరాణిక రూపకం. ప్రభావతీ ప్రద్యుమ్నం ఒక తెలుగు ప్రబంధ వస్తువుకు నాటకీకరణం. బొబ్బిలి పట్టాభిషేకం - సమకాలీన రాజకీయ సంఘటన వర్ణనం. బిడాలోపాఖ్యానాదులు అన్యాపదేశ అధిక్షేప కావ్యాలు. గుంటూరు సీమాదులు వివాద సాహిత్యం. ఇవికాక ఆంగ్ల గీర్వాణ భాషలనుండి అనువదింపబడిన కావ్యనాటక శతకాదులు, 'కథలు - గాథలు' అన్న పేరుతో వెలువడిన వచన రచనలు, వ్యాసాలు-పేర్కొన దగినవి. వీరు సాధించిన ప్రక్రియా వైవిధ్యాన్నీ, ప్రసరించిన నవ్యాలోకాన్నీ సమీక్షించి సమకాలీన విమర్శకులు 'నవ్య కవితా పితామహు' లని కీర్తించారు.

ప్రాత పునాదులపై నూతనభవనం కట్టినా రీజంటకవులు. ఒక్క సంస్కృత పాండిత్యంతో ఆంధ్ర కవిత్వం కరతలామలక మౌతుం దన్న సిద్ధాంతానికి వీరు బద్ధ విరోధులు.

'తెలుఁగు తెలుఁగని యద్దాన దిగుటె కాని
సంస్కృతమ్మున కన్నఁ గష్టమ్ము హెచ్చు
ఒక్కదానఁ బరిశ్రమ మున్నఁ జాలు
దాని, కిద్దానికో రెంటఁ దగుల వలయు'

అని వీరి ప్రబోధం. గీర్వాణాంధ్ర భాషాసాహిత్యాలను తరచి నిగ్గుదేల్చిన శబ్ద శాస్త్ర పారగు లన్న మాట లివి. శుకరంభాసంవాదంతో సంస్కృత కవనానికి స్వస్తి చెప్పి ఆంధ్ర కావ్య నిర్మాణరంగంలో దూకిన మాతృభాషాభక్తు లన్నమాట లివి ! తెలుగు నిఘంటువులు, తెలుగు వ్యాకరణ గ్రంథాలు ఎలా అసమగ్రులై ప్రతిభా వంతులైన కవుల ప్రయోగాలకు ప్రామాణికతను సిద్ధింపజేయలేక పోతున్నవో, స్వతంత్ర కల్పనా విశిష్టులైన కవుల కావ్య ప్రక్రియలకు నవ్యలక్షణ సూత్రాలనెలా లక్షణగ్రంథా లందించ లేకపోతున్నవో నిరూపించి, ఇటువంటి విషయాలలో కవితప్రియ ప్రయోగ ప్రామాణ్యాన్ని అంగీకరించి పండిత ప్రకాండులతో వాదులాడి తి. వేం. కవులు భాషా సారస్వతోపాసకుల ఇనుపసంకెళ్లను తొలగించి స్వేచ్ఛను ప్రసాదించారు.

'తెలుఁగున కున్న వ్యాకరణదీపము చిన్నది ! గ్రాహ్య మంచుఁ బె
ద్దలు కొనియాడు భారతము తప్పన శక్యముకాదు; దానిలోఁ
గలిగిన లక్ష్యభేదములు గాదన కాదృతి సంగ్రహించి ని
శ్చలగతి నిందుఁ గూర్చెదరు చక్కఁగఁ దిర్పతి వేంకటేశ్వరుల్'

కవిత్రయ ప్రయోగాలను పాక్షికంగా అంగీకరించి, పాక్షికంగా అంగీకరింపని అప్పకవి బాల వ్యాకరణ కర్త, శబ్దార్థ రత్నాకరకర్త మొదలైన వారూ, వారిని ప్రమాణంగా తీసికొని వాదులాడే కవిపండితులూ తి. వేం. కవుల వేడి చూపుకు గురికాక తప్పలేదు.

'వ్యాకరణ మొక్కతీరవ, మ
హాకవు లొక తీరవ, కోశ మఖిల మ్మొకతీ
రై కనుపట్టెడి, నీ భా
షాకావ్యమ్ములను దలచు చదివిన కొలదిన్.'
"కేవల సంస్కృత మర్యా
దావిదులును గేవలాంధ్ర తత్పరులును గా
కే వార లుభయభాషా
కోవిదు లవ్వారు దీని గురువులు జగతిన్."

అని మొగమోటం లేకుండా కుండబద్దలయ్యే టట్లు చెప్పి, —

'కేవలగ్రామ్య పదముల నేవగించి
జనులు వాడెడి పదములు సమ్మతములు
'కలవు లే' వని పెనగ శక్యంబె? భార
తాదులను లేని పదములు నవని( గలవె?,

అని సిద్ధాంతీకరించారు. హేతువుకు నిలబడే ఏ సిద్ధాంతాన్నైనా వారంగీకరించారు. గిడుగువారి వ్యావహారిక భాషా వాదాన్ని పరిశీలించి పద్యకవనంలోనూ, పాఠశాలల పాఠ్య గ్రంథాలలోను గ్రాంథికభాష ఉండాలనీ, వచనరచనకూ, గద్యసాహిత్యానికీ వ్యావహారికభాష ఉపాదేయ మనీ కవు లంగీకరించారు. కావ్యాల్లో కూడా రసవంతంగా ఉడేటట్లు వ్యావహారికపదాలు ప్రయోగించినా దోషం లేదని వారి మతం. అన్యదేశ్యాలను తమ రచనల్లో విచ్చలవిడిగా వాడిన విశాలహృదయం వారిది.

'కాలము( బట్టి దేశమును గాంచి ప్రభుత్వము నెంచి దేశభా
షాలలితాంగి మాటు టది సత్కవిసమ్మత మౌట నన్యదే
శ్యాలను నాంధ్రభాష( గల వౌటను నొచితి( బట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మని పండితు లేగతి నొప్పకుందురో?'

అని తమమతాన్ని సవినయంగానూ, సహేతుకంగానూ ప్రపంచించియున్నారు. ఇలా స్వాతంత్ర్యం ప్రకటించినప్పటికీ దేశభాషామర్యాదకు సంవదించని ప్రయోగాలనుగానీ, ప్రక్రియలనుగానీ వారు సమర్థించలేదు. తిరుపతివేంకటకవుల కవితాదృక్పథం ప్రాచీనమూఢవిశ్వాసాలకు ఎదురుచుక్క; సరసనవ్యకవితాదర్శాలకు పొడుపుచుక్క!

తిరుపతివేంకటకవుల కవితాశంఖారావం విన్న తెలుగుకవికి భయం తొలగింది; కలం సాగింది, ఉజ్జ్వలమైన భవిష్యత్తు గోచరించింది; ఇక కొన్ని శతాబ్దులవరకు కవిత్వం చావదనే ధైర్యం కలిగింది. ఆజంటకవుల దృష్టి ప్రాచీనకవితపై ఒక దివ్యాలోకం; నవీనకవితపై ఒక నవ్యాలోకం!

తి.వేం. కవులు సమకాలీన కవిలోకంలో మకుటంలేని మహారాజులవలె భాసించారు. ప్రత్యక్షంగానో పరోక్షంగానో వీరిప్రభావం పడని కవి ఇరవయ్యోశతాబ్ది పూర్వార్థంలో లేడంటే సత్యదూరం కాదు. ఒకతరాన్ని సృష్టించిన అపరకవి బ్రహ్మలు తి.వేం.కవులు.

తి.వేం. కవులకవిత్వం పండితపామరుల నందరినీ ఆకర్షించి ప్రజలహృదయాలలో చేరికూర్చున్నది. అంతప్రజాశక్తికి కారణం వారిప్రసన్నకవితాశైలి. వేంకటశాస్త్రిగారిలా అన్నారు-- 'రచన అనేది సుబోధంగా వుండా లనునది ముందు జనించిన పిమ్మట నాజనన మని నన్ను మన్నించువారు సంభావింతురుగాక! ఏమంటే కవిత్వ మనేది తనమనస్సులో వుండే అభిప్రాయాన్ని యితరులకు తెలుపుడు చేయడానికి పుట్టింది కాబట్టిన్నీ, ఆయితరులలో భాషాపాండిత్యం ఎక్కువ ఉన్నవాళ్లే గాక తక్కువగా ఉన్నవారు వుంటారు కనకున్నూ యీ అభిప్రాయం పండితులలో చాలామందికి రుచింపదు' (కథలు-గాథలు). పండితులకు రుచింపనంత మాత్రాన స్వీయసిద్ధాంతాన్ని మార్చుకోలేదు తి.వేం.కవులు. అంటే- వారు పండితులకొరకే కాదు కవిత్వం వ్రాసింది. సామాన్యప్రజల్లో సాహిత్యంమీద, కవిత్వంమీద ఒక క్రొత్త అభిమానం కలగటంతోపాటు, సృజనవ్యాసంగంకూడా ఏర్పడాలని కవిత్వం వ్రాశారు. హృద్యంగా మాట్లాడినట్లు పద్యాన్ని నడిపి చూపించారు; కవిత్వం చేయెత్తితే అందే చిటారుకొమ్మ అని అందించి చూపించారు. పాటకన్న పద్యానికే పరువం హెచ్చని పలికించి చూపించారు.

'రమణీయార్థప్రతిపాదక శబ్దః కావ్య' మ్మనే కవితాసిద్ధాంతం వీరిశైలికి మూలసూత్రం. యాంత్రికంగా రోజు రోజుకు వేగవంత మౌతున్న సామాజిక

జీవితంలో తీరికగా కూర్చుండి బృహత్సంహితలు మననం చేసుకొనే తీరికా ఓపికా లేవు. అందుకనే వేగానికి మరోపేరైన ఆశుకవిత్వాన్ని కవులు వెలయించారు. వీరి కవిత్వం వినంగాతే కలగేది శ్రీవణానందం ! ఆలోచించినకొలదీ రసప్రవణానందం ! దోబూచులాడే వ్యంగ్యవిలాసం, కాకువు వాని వెంట నిలచే అర్థగాంభీర్యం వారికవితకు సహజాలంకారాలు. ప్రసాదం వారి కవితకు నైజగుణం.

'కవుల మున్పటిరూల్సుకు కట్టుబడము
ఘనులు పండితరాయాదికవులు చూపు
త్రోవలంబట్టి పోదుము దేవు నైన
లక్ష్య పెట్టము..................'

'తనకు నాల్గునిఘంటు పదములు వచ్చు
ననుచుఁ బదిమందికినిఁ దెలియంగ మాఱు
మూలపదముల గుప్పిన ముచ్చటగునె ?
ప్రతిపదంబున రస ముట్టిపడినఁ గాక !

అన్నది వీరికవితాశైలికి సంబంధించిన ప్రతిజ్ఞ ! వేంకటశాస్త్రిగారి కవితా మార్దవాన్ని విశ్వనాథ సత్యనారాయణగారిలా కీర్తించారు.

'తన యెదయెల్ల మెత్తన కృతప్రతిపద్యము నంతకంటె మె
త్తన తనశిష్యు లన్న నెడదం గల ప్రేముడి చెప్పలేని మె
త్తన యయి శత్రుపర్వతశతారము సత్కవి చెళ్లపిళ్ల వేం
కన గురు వంచుఁ జెప్పికొనఁగా నది గొప్ప తెలుంగునాఁడునన్.

తిరుపతి వేంకటకవుల కవిత ప్రాచీనకవితకు భరతవాక్య మనీ, నవీనకవితకు నాందీవాక్య మనీ ప్రసిద్ధి గాంచింది. వారికవిత్వవ్యక్తిత్వప్రభావం భావకవిత్వయుగంమీద కూడా ప్రస్ఫుటంగా కనపడుతుంది. అష్టావధానంలోని ఆకాశపురాణం భావకవితాఖండికకు దగ్గరిరూపం. అవధాన ఆశుకవిత్వాల్లో వారు చూపిన ఆత్మాశ్రయవస్తుశిల్పం భావకవిత్వంలోని ఆత్మాశ్రయకవిత్వానికి సన్నిహితం. వారిభారత నాటకాలు పద్యనాటకకళను నేటికీ సజీవంగా ప్రజానురంజకంగా బ్రదికింపజేస్తున్నాయి. సంపూర్ణభారతనాటకరచనకు మార్గం చూపాయి. వీరిబుద్ధచరిత్ర కావ్యం అటువంటి కావ్యాలకు మార్గదర్శక మైంది. వారి జాతకచర్య పద్యస్వీయచరిత్రలకు త్రోవ

చూపింది. వారి జీవిత రసఘట్టాలను దర్శించి భావించిన సమకాలీనులకు కవిత్వంపై రక్తి కలిగింది, నవ్యతపై భక్తి కుదిరింది, కలంపట్టే శక్తి కలిగింది; తెలుగుకవితకు బంధవిముక్తి సిద్ధించింది.

ఎందరకో తాము కృతికన్యల నిచ్చి పారితోషికా లందుకున్న తి.వేం. కవులు శిష్యులనుండి కృతుల నందుకొని కృతిభర్తలైనారు. పింగళి కాటూరుల సౌందర నందం, సర్వాశేషయ్యగారి సుదర్శనోపాఖ్యాన మనే శశికళాస్వయంవరం మొ॥ వీరి కింకితమైన కావ్యాలు తి. వేం. కవుల తరువాత అవధానిచిరుదాంచితులు. పలువురు దేశంలో వెలసి అవధానకళను పోషించారు. తి. వేం. కవులకంటె అవధానం వేగంగా చేసినవారు, చమత్కారాలు ప్రదర్శించినవారు. వారితరువాత కొందరు కనపడతారు కాని వారిలాగా శాస్త్రపాండిత్యంతో వాదుల్లో జయపత్రాలు సాధించి, సభారంజకంగా గీర్వాణాంధ్రాలలో అవధానం నడిపిన వారు అరుదు. వారివలె తోడ్తోడ బహుళ సాహిత్య ప్రక్రియలు నిర్వహించిన వారూ కానరారు. తి.వేం. కవులు మహాకవులు, పండితులు, శాస్త్రదృష్టులు, రసజ్ఞులు, తాత్త్వికులు, దేవీభక్తులు, లోకజ్ఞులు, కవి గురువులు, శతాధికగ్రంథకర్తలు, ఒకయుగకర్తలు!

వారికి కింకవీంద్ర ఘటాపంచానన, విద్వత్కవి, బాలకళానిధి, బాలసరస్వతి, శతావధాని, కళాప్రపూర్ణ, మహాకవిచక్రవర్తి- ఇత్యాది బిరుదాలు సార్థకాలై రాణి స్తున్నాయి. వాటిలో 'కింకవీంద్రఘటాపంచానన' బిరుదం స్వదత్తాంకంగాని మిగతావి పండితపరిషత్తు లిచ్చినవే. తిరుపతిశాస్త్రిగారు గతించిన తరువాత వేంకట శాస్త్రిగారికి 'మహాకవిచక్రవర్తి' బిరుదం, ఆంధ్రవిశ్వవిద్యాలయం వారి 'కళాప్రపూర్ణ' బిరుదం లభించాయి. మదరాసురాష్ట్ర అస్థానకవి పీఠాన్ని వేంకటశాస్త్రిగారు మొదటి సారి అధిష్ఠించారు. ఇట్లు ఒకరికి జరిగిన గౌరవమైనా అది 'తిరుపతివేంకటకవుల' కిరువురకూ జరిగినట్లు వేంకటశాస్త్రిగారు భావించారు, అలాగే తెలుగుదేశం కూడా భావించింది.

తిరుపతివేంకటకవుల కవితావైభవాన్ని కమనీయంగా గానంచేసిన మహాకవు లెందరో ఉన్నారు. మచ్చుకు కొందరిపద్యాలను మనవి చేస్తాను- వీటిలో వేంకట శాస్త్రి ప్రశస్తి ఉన్నా తిరుపతివేంకటకవులకే అన్వయం.

'పుడమిని బెక్కుసత్కవులు పుట్టిరి; ముట్టిరి సత్కవిత్వపుం
దొడిమలు; చెళ్లపిళ్లకవితో, దులఁదూగెడువారెః వానలోఁ

దడియనివారు ముద్గురువధాన మృదూక్తి మరందధారలోఁ
గడుగని వారు మా కెచటఁ గానఁగరా రిలఁ దెన్గునాఁ డునన్' -విశ్వనాథ

'భారతసంహితన్ జదివి భాగవతమ్ము పఠించుకొంచు నో
రూర వరూథినీ ప్రణయమో, కలభాషిణి చిత్రవృత్తమో
సారె పఠించు నీ తెలుఁగుజాతికిఁ గ్రొంజవులూరు నీదు సిం
గారపుఁ గబ్బముల్ శ్రీవణనందన మయ్యెగదా కవిప్రభూ!'

'అవనీపాల సభాంతరమ్ముల నసూర్యంపశ్యయై పండిత
ప్రవరుల్ చర్వితచర్వణక్రియల నావర్తింపఁ గాఁజేయు నృ
త్యవినోదమ్మను జూపు మాతెలుఁగుకన్యన్ బల్లకీమీఁ దఁ ద్రి
ప్పవె దిగ్వీధుల నీవు నైకవిధ నైపథ్య ప్రదానమ్మునన్' -కాటూరి

'తెలుఁగుజగాన నేఁడు గడిదేరిన బాలకవీంద్రు లెల్ల మీ
పలుకులపందిటన్ జిగురుపట్టిన మొగ్గలు మీవధానకౌ
శలమున నూఁగిపోయిన దిశావలయమ్ము ప్రసన్నబుద్ధి మై
వలగొని మీ కొసంగెడు నుపాయనముల్ గొనుమయ్య సత్కవీ!'

'మదమంద్రిప్పని యాంధ్రపుత్రకుల ధీమా నీకళాసృష్టిలో
నుడికారమ్మున బట్టువడ్డ దనుకొందున్ భాషకున్ గ్రొత్తపో
కడ శిక్షించిన కికవీంద్ర గజశిక్షాదక్షహర్యక్షు! నీ
వడుగుల్ మెట్టినచోటఁ బుట్టెడి కవిత్వాదేశబీజావళుల్ -జాషువా

ప్రాక్తన శైలికిన్ భరతవాక్యము నాంది వినూత్నశైలికిన్
సూక్తి బహుశ్రుతుల్ పలుకుచుందురు మీ కవితన్ గురించి త్వ
ద్రోక్తము లార్షసూత్రములపోల్కి, బఠించెద గ్రంథభారతీ
భక్తులు పూర్వపుణ్య విభవవ్యయ లబ్ధము లేతదర్థముల్' -ఏటుకూరి

'మాటలు పెక్కేలా తొలి
నాటి కవిబ్రహ్మ తిక్కనప్రభుఁ డీవో
నేటి కవిబ్రహ్మవు నీ
నాటిన మల్లియలు తెలునాటి కవీంద్రుల్.' -తుమ్మల

# తిరుపతి వేంకటకవుల కవితావైభవం

## 1

శతఘంట కవనమ్ము సల్పు సంగతి యన్నఁ
　　కరతలామలకమ్ము గాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
　　'నంబి కొండయ దండనంబు' మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
　　'నల్లేరుపై బండి నడక' మాకు
సత్కావ్య నిర్మాణ చాకచక్యం బన్న
　　షడ్రసోపేత భోజనము మాకు

వ్యర్థ మగు వాదము లొనర్చు నట్టివారి
డంబ మణఁగించు టాపోశనంబు మాకు
దానరాధేయ! కవిసముదాయగేయ!
పండిత విధేయ! రామ భూపాలరాయ!'

తిరుపతి వేంకట కవులు గద్వాలను మొదట దర్శించినప్పు డా భూపాలునితో చెప్పిన పద్యమిది. ఆ జంట కవుల కవితా ప్రాభవం గుబాళించే సీసపద్య మిది. వారికి శత ఘంట కవనమంటే అరచేతిలోనున్న ఉసిరిగ పండుపంటిది. కష్టమైన అష్టావధానం నంబికొండయను దండించినంత తేలిక పని. ఆశుధారా కవిత్వం నల్లేరు మీద బండి నడకలాంటి అవలీలగా సాగే కవితా హేల. సత్కావ్య రచనం చేయటం షడ్రసోపేత భోజనంలాగా పాండితీ ప్రాభవాలను పసందైన కవిత్వంలో రుచి చూపించే సదవకాశం. వ్యర్థమైన వాదాలుచేసే వారి డంబ మణగించటం ఆపోశన మెత్తినట్టే వారికి. అవధాన కవిత్వం, ఆశు కవిత్వం, కావ్య కవిత్వం, వివాద కవిత్వం – తిరుపతి వేంకట కవులకు వెన్నతో పెట్టిన విద్యలు.

ఆశు, మధుర, చిత్ర, విస్తర కవితలని కవిత్వాన్ని నాల్గు విధాలుగా వింగడించారు ప్రాచీనులు. అందులో ఆశు కవిత వేగంగా చెప్పే కవిత. అందులో శాఖయే అవధాన కవిత. అచ్చమైన ఆవేశంతో నిరాడంబరంగా, రమణీయంగా, ధారావాహినిగా చేప్పే కవిత్వం ఆశు కవిత్వం. వేమన పద్యా లందుకు చక్కని ఉదాహరణలు. అవధాన ప్రక్రియలో ఆశు కవిత గడుసు పోకలు పోయింది. 'ఏకపాద, త్రిపాద, కఠినప్రాస, విషమ సమస్యా పూర్తులు వ్యస్తాక్షరీ సంఘటిత పద్యాలూ, నిషేధాక్షర రచనా చమత్కృతి సహితాలూ, ఆకాశ పురాణాలూ ఇవన్నీ అవధాన కళవలన ఆశువున కబ్బిన విశేష లక్షణాలు. ఇవి ఎంత అవరోధాలో అంత అలంకారాలు. ఎన్ని అవరోధాలూ, నియమాలూ ఉన్నా వేగంగా సాగటమే ఆశువు కున్న విశేషం, దీని నొక సాహిత్య కళగా పోషించారు గీర్వాణాంధ్ర కవులు. అందులోనూ ఆంధ్ర కవులు. ఆశు కవిత్వం చెప్పిన కవు లెందరో ఉన్నారు తెలుగులో. వారిలో తి.వేం. కవులకు ప్రత్యేక స్థానం ఉంది. జంట కవులుగా ఆశువును మొదటిసారి నిర్వహించింది వీరే. జాతికి కవితా చైతన్యాన్ని ఆశుకవిత్వంతో కలిగించింది వీరే.

అవధానం ఒక సాహితీ క్రీడ. చిత్తైకాగ్రతను అవధాన మంటారు. అది ప్రధానంగా అష్టావధాన మనీ, శతావధాన మనీ, సహస్రావధానమనీ మూడు విధాలుగా కనపడుతుంది. ఇందులో శతావధానాన్ని గూర్చి ఈ కవులే ఇలా లక్షణం చెప్పారు.

> 'తత్ర న్మానవ మానసాదృత తమం వృత్తం తథా వస్తు చ
> స్వీకృత్య ప్రథమం శతాయ సరయం తత్పాద మేకం వదేత్
> భూయఃకై ర్నచ బోధితః క్రమవశాత్పాదత్రయం కీర్తయే
> దేవన్నామ శతావధాన మథచే త్పద్యాని సంకీర్తయేత్'

శతావధానంలో నూరుగురు పృచ్ఛకులుంటారు. ఒక్కొక్క పృచ్ఛకుడూ తనయిచ్చ వచ్చిన విషయాన్ని నిర్దేశించిన వృత్తంలో తెలుగులో కానీ సంస్కృతంలోగానీ చెప్ప మని అవధానిని ప్రశ్నిస్తాడు. అవధాని ఆ పద్యంలో ఒక పాదం ముందు చెపుతాడు. అలాగే నూరుగురూ అడుగుతారు. అందరికీ మొదటి పాదం చెప్పుతూ వెళ్లతాడు. ఆ తరువాత క్రమంగా రెండవ, మూడవ, నాల్గవ పాదాలు ఒక్కొక్కసారిగా మూడుసార్లు వరుసలు పూర్తిచేసి నూరు పద్యాల రచనా పూర్తి చేస్తాడు. చివరకు ఆ నూరు పద్యాలనూ సభలో చదువుతాడు. ఈ లోగా పృచ్ఛకులు వరుస సంఖ్య మార్చి కూర్చున్నా వారి వారి సమస్యలు వారికే చెప్పాలి. వరుస తప్పించి పద్యా లడిగినా

వాటిని అడిగినట్లు చదవాలి. నూరు మందికి సంబంధించింది శతావధానమైతే, వేయి మంది పృచ్ఛకులకు సమాధానం చెప్పేది సహస్రావధానం. ఏ అవధానమైనా చివరి దాకా చేయటమే కష్టం. అందులో జంట కవులు ఒక్కొక్క చరణం చొప్పున చెపుతూ చేయటం మరీ కష్టం. ఇదే ఇంత కష్టమైతే అష్టావధానం చేయటం మరీకష్టం. అష్టావధాన లక్షణం చెప్పిన మాలిక చూడండి -

'అరయఁగ మే మొనర్పఁ గల మష్టవధానము, దాని రీతి నే
ర్పఱచి వచింతు; మెట్లనినఁ బండిత సమ్మతిగాఁ గవిత్వ మెం
ద అడిగిరేని యందఱకుఁ దప్పులు చొప్పడకుండ నాంధ్ర మం
దు రహిని దేవభాషను సుదుష్కర కల్పన లొప్పఁ జెప్పి, యెం
దరయినఁగాని కష్టపు విధమ్మున నెన్నిఁటినైనఁ గాని య
క్కరము లొసంగి రేని యవి గ్రైకొని తప్పక చెప్పి, యంత లో
క రయము మీఱ లౌకిక ప్రకారముగా వచియించువారి కు
త్తరము లొసంగి, మీఁదను ముదంబలరన్ జదరంగ మాడి, కొం
దఱకు గురుత్వమూని పఠనమ్ములఁ జెప్పి, పురాణగాథలన్
దుర మొనరన్ బఠింపఁగ నెదుర్కొని యర్థము చెప్పి, పుష్పముల్
గరము ను వీపుపై విడువఁగా సరిగా గణియించి, ఘంటికల్
నెఱయఁగఁ గొట్ట వానిని గణించి, నిషేధ మొనర్చునట్టి య
క్కఱములు మాని పద్యములు గల్పన చేసి మనోహరమ్ముగా
విరచన సేయ నేర్తుము'......

అష్టావధానంలో ఎనిమిదిమంది పృచ్ఛకు లుంటారు. వారందరికీ ఒకేసారి అవధాని సమాధానం చెప్పాలి. వారు అవధాని ఏకాగ్రతను భగ్నంచేయటానికి యత్నిస్తారు. అవధాని అవధానాన్ని నిర్వహిస్తాడు. ఇందులో ఉండే అష్టాంగా లివి- 1. పండితు లడిగిన అంశంపై గీర్వాణాంధ్రాలలో కవిత్వం చెప్పటం. 2. వ్యస్తాక్షరి. 3. లౌకికప్రసంగం లేక అప్రస్తుతప్రశంస. 4. చతురంగఖేలనం. 5. కావ్యపాఠం. 6. పురాణకథనం. 7. పుష్పాలనుగాని ఘంటికానాదాలను గాని గణించటం. 8. నిషిద్ధాక్షరి. ప్రథమాంగంలో సమస్యాపూరణం, కల్పన వర్ణనల్లో ఏదైనా ఉండవచ్చు. ఎనిమిదిమందీ కవితలనే కోరవచ్చునని కొందరంటారు. అప్పు డవధాని ఒక్కొక్క చరణంచొప్పున అందరిసమస్యలకూ పద్యాలు పూరించాలి. చతురంగ ఖేలనంలో

కొందరు చీట్లపేక ఆడతారు. పుష్పగణనానికి బదులు గణితవైద్య జోతిషాది శాస్త్రాంశాలను కొందరు గ్రహిస్తారు. కొందరు దత్తపది నిర్వహిస్తారు. పురాణకథనానికి బదులు ఆకాశపురాణాన్ని చెపుతారు కొందరు. ఏవి ఎలా మారినా ఎనిమిది అంగాలు అష్టావధానాని కుంటాయి.

శతావధాన అష్టావధానాల్లో అందరినీ ఆకర్షించేది సమస్యాపూరణం. ఆ తరువాత నిషిద్ధాక్షరి. ఇవి నిర్వహించటానికి భాషాపాటవం, లోకజ్ఞానం, నవనవోన్మేషమైన ప్రతిభా ఉండాలి. అర్థసమన్వయంలేని ఒకపద్యపాదమిస్తే దాని కర్థసమన్వయం కుదిరేటట్లుగా పద్యపాదాలను పూరించటం సమస్యాపూరణం. తిరుపతివేంకటకవు లవధానాల్లో ఎన్నోసమస్యలను అత్యద్భుతంగా పూరించారు. మచ్చు కొకటి రెండు.

సమస్య : "సతి సతిఁ గలయంగఁ బుత్ర సంతతి కలిగెన్"

పూరణం : అతి కుతుకం బలరారఁగ
జతురత మెఱయంగ మదనశాస్త్ర విధమునన్
వితతం బగు తన సౌధవ
సతి సతిఁ గలయంగఁ బుత్రసంతతి కలిగెన్.

సమస్య : "సంధ్యావందన మాచరింప వలదా చౌశీతి బంధమ్ములన్"

పూరణం : వింధ్యాద్రిప్రభ నొప్పు బల్ కుచములన్ వేపట్టి పెంపొందు కా
మాంధ్యం బార్పఁగ లేక వెఱ్ఱివలె నేలా మంచి యీరాతిరిన్
వంధ్యం జేసెదు; కాముకేళి యనఁగా బాండిత్యమా? లేక నీ
సంధ్యావందనమా? చరింపవలదా చౌశీతి బంధంబులన్.

సమస్య "సరసునివైపు వీపు నల చాన మొగం బటు గోడవైపు"

పూరణం : సరసునివైపు వీపు నల చానమొగం బటు గోడవైపు, నా
సరసుఁడు కేలు చాపు నల చానయుఁ జన్నులఁ జేయి మోపు, నా
సరసుఁడు కోర్కెఁ జూపు నల చాన దొడం దొడలోనఁ దోపు, నీ
వరుసనె తెల్లవారె నొకవైఖరి కొక్కని కొక్కవేశ్యతోన్".

అడిగెడి వాడికంటె అవధాని అరురెట్లు రసికుడుగా నుండాలి. అవధానం తెలుగునాట అవతరించి అభివృద్ధి చెందిన సాహిత్యకళ. దానికి శరత్పూర్ణిమ ఈ జంటకవుల అవధాన మహిమ.

## 2

గంగాధరుఁడు నీమగం డని నవ్వంగ
వేషధరుండు నీపెన్మి టనియె
నెద్దు నెక్కును నీదునెమ్మికాఁ డని నవ్వ
గ్రద్ద నెక్కును నీమగండ టనియె
వల్లకాడిల్లు నీవల్లభున కనఁగ
నడిసంద్ర మిల్లు నీనాథున కనె
నాట్యంబు సేయు నీ నాయకుం డన నంగుఁ
గావించు వెన్క నీకాంతు డనియె

ముష్టి కెక్కడి కేఁగె నీయిష్టుఁ డనిన
బలిమఖంబున కేఁగె నోలలన! యనియె
నిట్టు లన్యోన్య మర్మంబు లెంచుకొనెడు
పర్వతాంభోధికన్యలఁ బ్రస్తుతింతు.

19 0లో బందరు హిందూహైస్కూలులో జరిగిన శతావధానంలో లక్ష్మీపార్వతులసంవాదం చిత్రించిన పద్య మిది. ఆశువుగా చెప్పిన ఈపద్యంలో సంభావణ సజీవంగా నర్మగర్భంగా, పరస్పరాధిక్షేపపూర్వకంగా, స్త్రీప్రకృతిసహజంగా సాగింది; కూర్చుండి పనిపెట్టి వ్రాసిన ఏపద్యానికీ తీసిపోనట్లు కుదిరింది. అర్థం వివరించవలసిన అవసరం లేని సారళ్యం, ఆలోచనలో అమృతాన్ని వర్షించే అర్థగాంభీర్యం కవితలో నీరక్షీరంగా కలసిపోయి రాణిస్తున్నాయి. ఇందులో స్వారస్య మెంత ఉందో చమత్కార మంత ఉంది వాకోవాక్యశిల్పంతో పాటు వాక్యవక్రత రాణించింది. ఇలాంటి పద్యాలు వారి అవధానాలలో కోకొల్లలు. హరిహరునిపర్ణనం అచ్చతెలుగులో సాగింది.

"తాల్చె నెవ్వాఁడు కెందమ్మిదండంబోలె, నెదుటొమ్ముపై సిరు లిమ్పు చాన
మింగె నెవ్వఁడు నేరెడిపండు చందాన, కడలిలోఁ బుట్టిన కాఱువిసము
పూనె నెవ్వఁడు వెన్నముద్ద కుద్దిగ గేలఁ దెల్లసంచుల నించు నల్లసంకు
నానె నెవ్వఁడు మల్లెయలరుగుత్తుల పేరు, పోల్కిగా మెదనిండఁ బున్నదండ

వేవెలుంగుల దొరయును రేవెలుంగు, నెవనికన్నులు నిప్పుద న్నెవని నెక్కు
డట్టి మున్నీటి యల్లుఁడు; నట్టిమంచు, కొండయల్లుండు మీకుఁగోర్కులనొసంగు"

ఒక్కొక్క పాదంలో ఒక్కొక్క మూర్తి తెలుగుతీయదనంతో కన్నులముందు ప్రత్యక్షమై అద్వైతసిద్ధిని అనుభూతి కందిస్తాయి. తిక్కన్న హరిహరనాథుడు తిరుపతివేంకట కవుల్లో తేటగా దర్శనమిస్తాడు.

శతావధానం సామాన్యంగా నాలుగురోజుల పడుతుంది. కాలపరిమితి మొత్తానికి పదునారుగంటలనుండి ఇరువదినాలుగుగంట లుంటుంది. శతావధానప్రక్రియలో మనకు అద్భుతాన్ని కలిగించే కొన్నిఅంశాలను గమనిద్దాం. 1. అవధానం పూర్త్యయ్యేంత వరకూ వర్ణనాదులు అవధానికి మరపుకు రాకుండటం 2. ఏదైనా అంశం స్ఫురింపక పోతే అవధాని ఇష్టదేవతాప్రార్థనరూపంగా ఒకఆశుపద్యాన్ని చదివి దానిని జ్ఞాపకం చేసుకోవడం. 3. అవధానం నిర్వహిస్తూ చమత్కారాలనూ, ఛలోక్తులనూ అవధాని పద్యాలలో గుప్పించి సభను రజింపజేస్తూ ఉండటం అవధానం చేసేవారి కెంత కష్టమో వినేవారికి కంత ఆహ్లాదం.

ఒకసారి గద్వాలలో అసూయాపరులైన పండితులు శతావధానం తామూ చేయగల మని పంతంపట్టి పూర్తిచేయలేక భంగపడినారు. ఆ తరువాత తి. వేం. కవులు శతావధానం ప్రారంభించి అంజనేయప్రార్థనం చేస్తూ అశక్తులైన అవధానులను అధిక్షేపంచేశారు.

'నాలుగామడ దాట నానేర్తు, మీఁద నా- చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
ఎన్మిదామడ దాట నే నేర్తు, మీఁద నా- చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
పదియామ డైన నేఁ బరతెంతు, మీఁద నా-చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
పంద్రెండయిన నాదుపని గాని, మీఁద నా- చేతఁ గాదను నొక్క కోతిగాఁడు
ఇట్లు పల్కుచు నున్న కపీశ్వరులు శిరములు వంపంగ శతయోజనముల వార్ధి
దాఁటి వచ్చిన నిన్నెన్నఁ దరమె మాకు, నాంజనేయ కవిధ్యేయ యప్రమేయ!

అన్యాపదేశ హాస్యప్రసంగానికి ఈపద్యం చక్కని ఉదాహరణం. శతయోజనాల వార్ధివంటిదే శతావధానం. దానిని దాటటంలో ఉన్న సాహసం సర్కసులా అనిపిస్తుంది ఆధునికులకు. శతావధానాన్ని సర్కసుతో పోల్చి చెప్పారీకవులు;

'తిరుపతి వ్యాఘ్రమై బయలుదేరిన శిష్యులు గున్నయేన్గులై
వరలఁగ దేరగాఁ దగినవారలు బెబ్బులిపిల్ల లెల్ల మా
ర్తురు కపికుర్కురమ్ము లయి తోఁపఁగ వేంకటశాస్త్రి వీరికే
సరిగ శతావధాన మను సర్కసు చూచితివమ్మ శాంకరీ!'

సర్కసు శారీరక పరిశ్రమ. శతావధానం మానసికపరిశ్రమ. ఒకటి ఆహ్లాదాన్ని కలిగిస్తే మరొకటి ఆనందాన్ని వర్షిస్తుంది; రెండూ అద్భుతానికి అలవాలాలే!

## 3

**దోస మటంచు జెఱింగియును దుందుండు కొప్పఁగఁ బెంచినార మీ**
**మీసము రెండుబాసలకు మేమె కవీంద్రుల మంచుఁ దెల్పఁగా**
**రోసము గల్గినం గవివరుల్ మము గెల్వుఁడు; గెల్చిరేని యీ**
**మీసము తీసి మీపదసమీపమునం దల లుంచి మ్రొక్కమే?**

శ్రోత్రియు లైన తిరుపతివేంకటకవులకు మీస ముండటం దోషంకాదా అని ఒకగడుసరి ప్రశ్నిస్తే తి. వేం. కవు లిచ్చిన వీరోచితమైన సమాధానం- ఈపద్యం. మీసాలున్న తెలుగువారు మోజుపడి చదువుకొనే మనోజ్ఞమైన పద్యం సంస్కృతాంధ్ర కవిత్వాల్లో సవ్యసాచులు తి. వేం. కవులు. సవాలు చేసినా సగర్వంగా ప్రతిజ్ఞను నిలుపుకొన్న ప్రజ్ఞానిధులు. సాహంకారంగా చెప్పుకొన్న మాట నైనా సహజాలంకారంగా సాగించుకొన్న ప్రతిభామూర్తులు తి.వేం. కవులు.

అవధానాల్లో పృచ్ఛకులు అవధానుల నెన్నోవిధాలుగా పరీక్షిస్తారు. శాస్త్ర విజ్ఞానాన్ని పరీక్షించే వారు కొందరు, జటిలసమస్యల నిచ్చి తికమకపెట్టే వారు కొందరు, అల్పసమస్యల నిచ్చి కల్పనను పరీక్షించేవారు కొందరు. ఈ చివరివారి చిల్లరప్రశ్నలు ఎంత చిలిపిగా ఉంటాయో అంత చమత్కారాన్ని కలిగిస్తాయి. వారు

వేసే ప్రశ్నలస్వరూపస్వభావా లిలా ఉంటాయి. పకోడీమీద చంపకమాలావృత్తం, పచ్చిమిరపకాయమీద సీసపద్యం, కిరసనాయిల్‌మీద స్రగ్ధరావృత్తం, చీపురుపుడక మీద కందపద్యం, పొడుముకన్న చుట్ట నయమనే అంశంమీద సీసపద్యం, మీసాల వలని నష్టాలపై సీసపద్యం, పొడుముమీద సీసపద్యం, పకోడీమీద ఉత్సాహవృత్తం, సూదిమీద ఉత్పలమాలావృత్తం, నశ్యంమీద శార్దూలవిక్రీడితం, గ్రామఫోన్‌మీద మందాక్రాంతావృత్తం, నూవురంమీద స్రగ్ధరావృత్తం, చెదపురుగుమీద శార్దూలం. నల్లిమీద కందం, దోమకాలుమీద మహాస్రగ్ధరావృత్తం, చిల్లపెంకుమీద సీసం, రెల్లు పూతమీద అచ్చ తెలుగులో మందాక్రాంత, కంటిపాపమీద విచకలితావృత్తం, కొత్తగా ముండమోసిన జవ్వని యేడుపునుగూర్చి సీసం, బిడాలంమీద మందాక్రాంతం, చీపురుముల్లుపై సీసం- ఇలా ఉంటాయి సమస్యలు. సమస్య లీజంటకవులకు సరససల్లాపాలుగా ఉండేవి. నవ్వుతూ పృచ్ఛకులనూ, ప్రేక్షకులనూ, కవ్విస్తూ అవధానాన్ని అమోఘంగా నిర్వహించేవారు. వస్తువు నీరసమైనా కవుల ఉక్తివిశేషంలో ఊపిరిపోసికొని ఉజ్జ్వలంగా భాసించేది. మచ్చుకు పకోడీమీద చెప్పిన ఉత్సాహ వృత్తం చూడండి.

'సెనగపిండి ఉల్లిపాయ చిన్నమిర్చకాయలుం
జొనిపి యందు నల్ల మింత చొనిపి ముద్ద చేసినన్
అనలతప్తమైన నేతియందు వైచి వేచినం
జను పకోడి యనెడి పేరఁ జక్కనైన ఖాద్యమై;

అవధానాల్లో ప్రశ్న లన్నీ పలచబారినవే అయిఉండవు. ప్రతిభను పట్టి యిచ్చే ప్రశ్నలుగూడా ఉండేవి. బందరులో సంధ్యారాగవర్ణనం చేయ మన్నాడొక పృచ్ఛకుడు.

'వారుణీకామినీఫాలభాగంబునఁ- బొల్పొందు కుంకుమపూఁత యనఁగఁ
జక్రవాకీమనస్సరసిజంబునఁ జొరఁ - బారు సంతాపాగ్నివార మనఁగ
నస్తాద్రిపై నేగు నరణుఁ డడ్డము వెట్ట- నేగు పద్మిని యనురాగ మనఁగ
కాలమాయావిచేఁ గాల్చి పెట్టిన గురు స్ఫురదయోమయము తాకఱకు లనఁగ

సంజకెంజాయ చెన్నారె సర్వభూసు- రాధికులు సంధ్యవార్చగా నాపగాస
మీపములకేగి రుత్సాహ మింపుగొల్ప - మెల్లమెల్లనఁ జీఁకటు ల్మెండుకొనఁగ.

భావనా రమణీయంగా సాగిన ఈప్రకృతివర్ణనం ప్రబంధ వర్ణనలను జ్ఞప్తికి తెస్తుంది. ఆశుకవితలో కూడ కావ్యకవితాగౌరవాన్ని కాపాడిన కవులు తి.వేం.కవులు.

'ఇతరకవుల్ ప్రయాసపడి యెంచి రచించిన నూటి కెన్ని పె
ద్దతనము గాంచి చిత్తమును దన్పునొ, మే మవధానసంగత
స్థితి గని యాశుగా రచనచేసిన పద్యములందుఁ జూచినన్
శతమున కన్నిపద్యములు చక్కఁగ నుండు నసంశయంబుగన్'

మహాకవుల మాటలే మనోజ్ఞకల్పకాలు- ఇక పద్యాలు హృద్యశిల్పనందనాలు.

## 4

చదువగా వలె శబ్దశాస్త్రాదికమ్ములను
వీక్షింపఁగా వలె విద్యలెల్లఁ
జూడగా వలె రాజచూడామణులసభల్
పొందగా వలె మహాభోగములను
దిరుగగా వలె దేశదేశాల వెంబడిఁ
బడవలె పడరానిపాటు లెల్ల
వినఁగావలెను పూర్వవిద్వచ్చరిత్రముల్
దర్శింపవలెను ఛందఃప్రశంస

కవులు కవు లన్న మాత్రాన కవులు గారు
ఎంత భారమ్ము గలదొ కవీశ్వరులకు
నెఱుఁగకుందు రె మీవంటి నృపతిమణులు
శ్రీమదానంద గజపతి క్షితితలేంద్ర !

'విద్వత్కవయః కవయః కేవలకవయః కపయః' అని ప్రాచీనోక్తి. కవులకు ప్రతిభ యెంత ముఖ్యమో శాస్త్రవ్యుత్పత్తీ, లోకజ్ఞానం అంత ముఖ్య మని తి.వేం. కవులు చెపుతున్నారు. వ్యాకరణం చదివితే శబ్దంమీద అధికారం వస్తుంది. ప్రాచీనకవిప్రయో

గాల్లో, జనప్రియోగాల్లో సాధుత్వాసాధుత్వ వివేచనం కలుగుతుంది. తి.వేం.కవులు ప్రాచీన సాహిత్యాన్నంతా ఆపోశనపట్టిన అగస్త్యులు. ప్రయోగాలకు ప్రమాణం చూపే పాండిత్యం వారికి జిహ్వాగ్రం మీద ఉండేది. వాదాల్లో, పండితసభల్లో వారి కాప్రజ్ఞ ప్రాణతుల్యంగా నిలిచేది. శుష్క శాస్త్రపాండిత్యమే కాకుండా ప్రయోగం ప్రయోజన వంతంగా ఉండా లనీ, శాస్త్రానికి సహకారంగా లోకజ్ఞానంకూడా ఉండాలనీ తి.వేం. కవులు భావించేవారు. అందువల్ల 'ర'కూ బండిరాకూ యతిప్రాసలు చెల్లరాదనే చాదస్తాలు వారి కుండేవి కావు. అన్యదేశ్యాలను ధారాళంగా గ్రహించే తెగువ వారి కుండేది దేశకాలాలనుబట్టి భాషాలలితాంగి మారుట సహజ మని నమ్మిన విశాల హృదయు లాకవులు. 'ఏకలెక్టరుకు లే దింత వర్కనుభంగి, ను త్తరములును బ్రత్యు త్తరములు' అని నిరాఘాటంగా వాడి నారాంగ్లేయపదాలను. పదప్రయోగంలో వారి దృష్టి ఔచిత్యాన్ని ఒరవడిగా పెట్టుకొని నడిచేది.

నిల్వ యున్న నీరులాగా కవి ఒకేచోట ఉండిపోతే అతనిబుద్ధి వికసింపదు. వివిధదేశాలు చూడాలి; వివిధవర్గాలతో చర్చలు జరపాలి; నానారాజ సందర్శనం చేయాలి, కష్టసుఖా లనుభవించాలి. అప్పుడు కాని కవి లోకజ్ఞుడు కాడు. విద్యలు సానపట్టిన కత్తుల్లా పదను తేలవు. శ్రీనాథకవిసార్వభౌముడూ తి.వేం.కవులూ దేశాలు తిరిగారు, ఆస్థానాల్లో ఉన్న పండితుల్ని ఓడించారు. సన్మానాలు పొందారు; తమ జీవితాన్ని కవితాజైత్రయాత్రగా గడిపారు.

ఏనుగు నెక్కినాము ధరణీంద్రులు గొల్వగ నిక్కినాము స
న్మానము లందినాము బహుమానములం గ్రహియించినార మె
వ్వానిని లెక్కపెట్ట కనివారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధులంచుఁ బేరుగనినారము నీవలనన్ సరస్వతీ!

తిరుపతివేంకటకవుల సాహిత్యయాత్రలు తెలుగులో సజీవసాహిత్యచైతన్యాన్ని రేకెత్తిం చాయి. తెలుగుజీవితంలో కవిత్వం జీవనాడిగా స్పందించింది. పుంభావసరస్వతీ మూర్తులుగా దేశం వారిని కీర్తించింది. వారికవితఒకతరాన్నే ఉత్తేజిత పరచింది. అది తరతరాల కవితా ఫలాన్ని పండించింది.

## 5

**విను మొకమాట చెప్పెదము వీనుల కింపుగ; నెల్లవారలన్**
**గని వినుతింపఁబోము పదిగంపలకెంపు లొసంగుఁ గాక లే**
**దని వినుతింప మానము రసాధికులన్, గవితామతల్లికిన్**
**ధనము ప్రధానమా రసికతాసుఖతల్ ప్రధానమా?**

మొగల్‌తుర్తిరాజును దర్శించినప్పుడు చెప్పిన పద్య మిది. రసికులైన ప్రభువులకు కవితా ప్రాభవాన్ని చూపించి సన్మానా లందారు తి.వేం. కవులు. నాడు సంస్థానాధీశులకొలువుల్లో సంస్కృతాంధ్ర పండితులూ కవులూ పోషింపబడుతుండేవారు. తి.వేం. కవు లాయాసంస్థానాలను దర్శించినప్పుడు ఆ పండితులసభల్లో తమ అవధాన కవితాపాగల్భ్యాన్ని ప్రకటించి పండితకవిసన్మానాలను పొందుతుండేవారు.

సంస్థానాధీశుల్లో సాహిత్యప్రియులూ ఉన్నారు. సంస్కారరహితులూ ఉన్నారు. రసికులూ ఉన్నారు, భోగులూ ఉన్నారు. వదాన్యులూ ఉన్నారు, పిసినారులూ ఉన్నారు. తి.వేం. కవులు సంస్కారం లేని రాజులకు సాహితీసౌగంధ్యాన్ని చవిచూపించి సాహిత్యపోషణకు ప్రేరేపించేవారు; సహజసాహితీసారవివేకులైన ప్రభువుల్ని తమ కవితామృతరుచుల నదించి పునీతులను చేసేవారు. సాధ్యమైనంతవరకు సరసులైన రాజులనే దర్శించారు, సౌమ్యంగా అభినందించారు. మన్నింపకపోతే మెత్తగా మందలించారు. పెడచెవిన బెడితే ఫెళ్లున చెంపపెట్టు పెట్టినట్లు అధిక్షేపించారు, సుముఖులైతే గుణకీర్తనం చేశారు, మ్రొక్కితే ఆశీస్సు లందించారు, గౌరవించి కోరుకున్నచో కృతుల నంకిత మిచ్చారు. రాజులదగ్గరికి వెళ్లినప్పుడు కవులు యాచకులుగా వెళ్లలేదు. కవిరాజులుగానే వెళ్లారు. మీరంగంలో మీ రెంతో మారంగంలో మే మంత అంటూ సమానస్కంధాలో సమావేశమయ్యేవారు. వేంకటగిరి ప్రభువును దర్శించినప్పుడు

'పరదేశసంపాదనరతి మీకు నరేంద్ర! పరదేశసంపాదనరతి మాకు;
లసదుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర! లసదుత్తమపదాభిలాష మాకు;
సకలనుత్యశ్లోకసక్తి మీకు నరేంద్ర! సకలనుత్యశ్లోకసక్తి మాకు;
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర! మనుమార్గవర్తనం బనువు మాకు;
మీకు రాజపదము మాకును గవిరాజు - పదము కల దికెందుఁ గొదువ లేదు;
కాన సామ్య మిచ్చి మానించు టొప్పదే - ముద్దుకృష్ణ యాచ భూవరేణ్య!

శ్లిష్టపదాలలో సామ్యాన్ని సాధించే చమత్కార ముంది ఈపద్యంలో. రాజులకు అన్య దేశాల నాక్రమించే ప్రీతి, పెద్దపెద్ద పదవులను పొందాలనే అభిలాష, జను లందరూ పొగిడే కీర్తిని వాంఛించటం, మనుధర్మశాస్త్రానుగుణంగా నడుచుకొనే నేర్పు సహజంగా ఉన్నట్లే కవిరాజులకు ఇతరదేశాలలో సంపాదనం చేయాలనీ, సార్థకాలైన పదాలను కవితలో వాడాలనీ, అందరూ విని మెచ్చుకొనే శ్లోకాలనూ, పద్యాలనూ విరచించాలనీ, చిరకాలం లోకంలో నిలిచే కావ్యరచనామార్గాన్ని అనుసరించాలనీ అభిలాష ఉండటం సహజం.

తిరుపతివేంకటకవులు దర్శించిన ఆస్థానానికి వారికవితలో అక్షయమైన స్థానం లభించినది; వారిని సన్మానించిన రాజుప్రశస్తి జయపతాకలా చిరకాలం సాహితీలోకంలో రెపరెపలాడుతోంది. వారి నానారాజసందర్శనం సమకాలీన సంస్థానాధిపతుల కబ్బిన అక్షరాభిషేకం!

## 6

కఠినమ్ములగు రాళ్లు కలిపి కట్టిన రామ
    భజనాలయమ్ములే పడక లాయెఁ
దాకిన మాత్రానఁ దనువు కఱ్ఱగఁ జేయఁ
    జాలిన చన్నీటి స్నాన మాయె
ముడికియు నుడకని కడువేడిమెతుకులే
    యాఁకొన్నకడుపున కడ్డమాయె
ప్రభు విచ్చె వేనూటపదియాఱు లనునట్టి
    స్వప్నమ్ములే ధనార్జనము లాయె

వీని నన్నిటి గోపాలవిభుఁడు దీర్చె
మరల నీలాటికష్టముల్ మాకు దూర
తరములై యుండఁ జేయు మిత్తఱిని గీర్తి
సాంద్ర! శ్రీముద్దుకృష్ణయాచేంద్రభూప!

ఒక్కొక్క ఆస్థానంలో రాజదర్శనంకోసం ఎన్నోనాళ్లు వేచియుండవలసి వచ్చేది. వేచి వేచి విసిగి వేసారి కవులు రాజుకు పద్యాలలో అర్జీలు పంపేవారు. ఒక్కొకసారి ఒకటిరెండుఅర్జీలు పంపుకుంటేతప్ప సభ పెట్టించటమో, సన్మానంచేయటమో జరిగేది కాదు. వెంకటగిరి ప్రభువుకు పెట్టుకున్న రెండవ అర్జీలోని పద్యం ఇది. అర్జీలకు గూడ సాహిత్యగౌరవాన్ని కల్పించిన దర్జా తి. వేం. కవుల కవిత కబ్బింది!

అర్జీలు పారని చోట నిందాస్తుతి రూపమైన నిష్ఠురాలు వినదించేవి. ఆత్మకూరురాజు కృతి గొని సన్మానించనందుకు వ్యంగ్యోక్తిలో సున్నితంగా అధిక్షేపించారు.

'నీమీద కృతిచెప్పి నిను నుతించిన కృష్ణ-మాచార్యవరుఁడు సన్న్యాసి యయ్యె
నీదు సంస్థానపండితుఁ డైన యల శ్రీని- వాసార్యవరుఁడు ప్రవాసి యయ్యె
నీగాయకుఁడ నంచు జోగియై రాఘవా- చార్యుఁ డూరూర యాచనకుఁ దిరిగె
నీ కిలవేల్పైన యాకూర్మతిస్వామి- యడవిగుట్టల నంగలార్పఁ దొడఁగె
నెటిగియును నీకుఁ గృతి నిచ్చు గురుమనీష లరయఁ దిరుపతి వేంకటేశ్వరులె కాక
నీదులోప మొకింతయును లేదు నమ్ము- మాత్మకూరుపురీరాజ! యతులతేజ!'

తమయందు నిరసనభావాన్ని ప్రకటించిన విశాఖపట్టణం శ్రీగోడే గజపతిరావు మీద చెప్పిన పద్యం ఆరాజుకీర్తిచంద్రునిలో ఆచంద్రార్కం నిలిచిపోయే మచ్చ.

'సంగరశక్తి లేదు వ్యవసాయము సేయుట సున్న సంతలో
నంగడి వైచి యమ్ము టది యంతకు మున్నె హుళక్కి ముష్టికిం
బొంగు బజాన వైచుకొని పోయెద మెచ్చటి కేని ముష్టి చెం
బుం గొనిపెట్టు మొక్కటి యమోఘ మిదే గజదంతిరాణ్ణృపా!'

తిట్టైనా, దీవనైనా వారి వాక్కుల్లో వారిద్దు లుండేంతవరకూ నిలచిపోయేదని ఆరాజుల కానాడు తెలుసునో తెలియదో గాని చరిత్రమాత్రం దాన్ని చెరిగిపోకుండా రక్షిస్తోంది. తిట్టు మచ్చైనా వారి సాహిత్యంలో నిలిచిన ఆరాజచంద్రులకు అలంకారంగానే సహృదయులు భావిస్తారు.

**7**

**ముద్దుముద్దుగఁ జెప్పఁ బూనితిమా పన్నె**
**లాఁడి తీయనిమోవి లంచ మిచ్చుఁ,**
**గతినమ్రగాఁ జెప్పఁ గడఁగితిమా ప్రౌఢ**
**కాంత వక్షోజముల్ కాన్క నొసఁగుఁ,**
**దీర్ఘరీతిని జెప్పఁ దెరకొంటిమా వాలు**
**గంటి లేఁజూపు సుంక మ్మొసంగు,**
**మిశ్రరీతిని జెప్ప మేకొంటిమా బోటి**
**బిగువుకౌఁగిలి పన్నుఁ బెట్టి తీలు**

